# కావవే కామేశ్వరీ!

## (కామేశ్వరీ శతకము)



**కవితా ప్రసాద్**

“దైవజ్ఞ రత్న”

## బ్రహ్మశ్రీ కవితా కామేశ్వరశర్మ



(క్రీ.శ. 26.06.1916 - 19.01.1990)

కడిఁది నెడఁదఁ దెలతుఁ గామేశ్వరాఖ్యుని
నయ్య గురువుఁ బద్య మల్లుటందు
నభ్యసనముఁ గూర్చి యభిరుచిఁ బెంపొందఁ
జేసెఁ జిన్న నాఁడె చెయ్యిఁ బట్టి!

ఘనుఁడు సుప్రసిద్ధ కవితాన్వయశశాంకు
డాతఁడవనిలోన జ్యోతిష స్వ
రూపుడన్న కీర్తిఁ బ్రాపించినట్టి దై
వజ్ఞ రత్నమతనిఁ బ్రాంజలింతు !

– కవితా ప్రసాద్

# కావవే కామేశ్వరీ!

## (కామేశ్వరీ శతకము)

కవితా ప్రసాద్

శంకరాభరణం ప్రచురణలు



శంకరాభరణం

శరణం పండిత మానసాపహరణం, శశ్వద్యశఃకారణం, సరసానందద వాగ్విలాస చరణం, శబ్దార్థ సంపూరణమ్।
చరదత్యద్భుత సత్కవీశ్వరగణం, సాలంబనం 'శంకరాభరణం', నిత్యమహం స్మరామి విలసద్ వాగ్దివ్యసింహాసనమ్ ॥

**కావవే కామేశ్వరీ!**

(కామేశ్వరీ శతకము)

రచన

**కవితా ప్రసాద్**



ప్రథమ ముద్రణ : జూన్ 2021

ప్రతులు : 100

వెల : అమూల్యం

'శంకరాభరణం' ప్రచురణలు : 50

ప్రాప్తిస్థానం :
Kavitha Prasad,
73-18-8/1F, S2 - Sree Nandanam Apt.,
Sree Balaji St., (Near Venkateswara Temple),
A.V. Apparao Road,
Rajamahendravaram-533103 (AP)
Phone : 9490168907

డి.టి.పి. : కంది శంకరయ్య (7569822984)

కవర్ డిజైన్ : విట్టుబాబు (85550 82034)

ముద్రణ : ముద్రికా ప్రింటర్స్, విజయవాడ

'మధుర భారతి',

**ఆచార్య**

**మల్లాప్రగడ శ్రీమన్నారాయణ మూర్తి**

విజయవాడ

# కవితా ప్రసాదము

**"చతురకవిత్వ తత్త్వ పటు సంపద యొక్కరి సొమ్ము గాదు భా**
**రతి దయ సౌధవార్థి; కవి రాజుల మానసముల్ ఘటంబులా**
**యతము కొలంది లబ్ధమగు నయ్యమృతంబు.."** అన్నాడు కనుపర్తి అబ్బయామాత్యుడు.

వాగ్దేవతను ఉపాసించి సంస్కృతాంధ్రాలను అభ్యసించి పద్యరచనా పథంలో ప్రవేశించి కృతార్థులైన కవులెందరో ఈనాడు సారస్వతరంగంలో కనిపిస్తారు. అలాంటివారిలో తనదైన ముద్రతో ఔననిపించుకొన్న మంచి కవి శ్రీ కవితా ప్రసాద్. చిరకాలంగా సాగుతున్న వారి సారస్వత ప్రస్థానంలో ఇప్పటి మజిలీ ఈ 'కామేశ్వరీ శతకం'. శతక నియమాలన్నీ పాటిస్తూ భక్తి రసప్లావితంగా సాగిన రచన ఇది. మత్తేభ శార్దూలాలు హుందాగా నడిచిన ప్రౌఢ రచన ఈ శతకం.

**"శ్రీకైవల్యపదమ్ము గాక కొఱలం జింతింప సంసారపుం**
**గీకారణ్యతమఃప్రదేశచలదంఘ్రిన్నాకు వేరొక్కఁడే**
**లా కామ్యంబిఁక..."** (1) అన్న ఎత్తుగడ కవి హృదయానికి అద్దం పడుతోంది. "కవనార్థంబుదయించితిన్.. భవ మద్దాన తరింతు" నన్న చెళ్ళపిళ్ళ కవి సూక్తిని స్ఫురణకు తెస్తోంది కవితా ప్రసాద్ భావన.

కర్మ సిద్ధాంతం ఆధారంగా అమ్మను యుక్తియుక్తంగా ప్రశ్నించారు కవితా ప్రసాద్. 'నా ప్రతి కదలికా నీ అధీనమే అయి ఉండగా నేను కర్మఫలం అనుభవించాలనటం ఎలా సమంజసం?' అన్న ప్రశ్న ఆలోచనామృతం.

**"తనువున్ బ్రాణము నిచ్చి లోకమున సంధానించితే కాని నా కని గోరంతయు నేని స్వేచ్ఛనిడితింగావే కదా!"** (2) చేతలు తన చేతులలో లేవని జీవుడు గుర్తించాలని కవి హృదయం.

అంతులేని సిరిసంపదలు కావాలని ఆరాటపడి ఎంత ఆర్జించినా పరలోక సుఖప్రాప్తికవి ఏమీ అక్కరకు రావనే సందేశాన్ని-

**"పరువుల్వెట్టితి డబ్బుదస్కముల సంపాదింప నీముల్లె నా కొరగింపంగలదే పరంబని మదిన్యోచింపఁగానైతి..** (5) నని తనకు తానే చెప్పుకొనే రీతి సహజ సుందరంగా సాగింది.

శాక్తేయ సాహిత్యం పట్ల స్పష్టమైన అవగాహన ఈ కవికున్నట్లు ఎన్నో పద్యాలు సాక్ష్యమిస్తున్నాయి. ముఖ్యంగా దేవీ భాగవతం, లలితా సహస్ర నామ స్తోత్రం మొదలైనవి ఈ కవి మానస జిహ్వలపై నిరంతరం నర్తిస్తున్నాయని ఈ శతకం వల్ల తెలుస్తోంది. అమ్మవారి చేతివ్రేళ్ళ గోళ్ళ చివరలనుంచే శ్రీహరి దశావతారాలు ఆవిర్భవించాయని లలితా సహస్రంలోని "కరాంగుళి నఖోత్పన్న నారాయణ దశాకృతిః" నామం వివరిస్తోంది. **"చేవేల్గోళ్ళ దశావతారముల సృష్టింజేయు నీశక్తికిన్"** (7) అని ఆ భావాన్ని చక్కగా తెలుగు చేసి నిరూపించారు కవితా ప్రసాద్.

దివ్యవిమానంలో మణిద్వీపానికి చేరిన త్రిమూర్తులు అమ్మ సన్నిధికి చేరగానే మహిళలుగా మారిపోయిన సన్నివేశం దేవీ భాగవతంలో కన్పిస్తుంది. **"నీ సాన్నిధ్యము మూడు మూర్తులకు సంధించెం గదా స్త్రీత్వమున్"** అంటూ ఆ సన్నివేశాన్ని గుర్తుచేస్తూ **"సామర్థ్యముఁ బమ్ము బొందెఁ గద బ్రహ్మ శ్రీశ ఫాలాక్షులున్"** (11) అని ఆ సన్నివేశంలోని ఆంతర్యాన్ని వివరించారు కవి.

సృష్టి స్థితి లయాలు తన అధీనమై ఉన్న జగన్మాత విష్ణుమూర్తిని వటపత్రశాయిగా చేసిన వృత్తాంతాన్ని గుర్తు చేస్తూ **"తెలియం బోలక పోయె చక్రికి మణిద్వీపాన నిన్ గాంచుదాక"** (22) అని ఆ పురాణ సన్నివేశాన్ని స్ఫురణకు తెచ్చారు శ్రీ కవితా ప్రసాద్.

శతకంలో ఆత్మాశ్రయ భావాలు అందంగా ఆవిష్కరిస్తూ ఉంటారు కవులు. తనకోసం ఆస్తులు కూడబెట్టి ఇవ్వలేక పోయిన తన తండ్రి **"గణపెన్ మోక్షప్రదంబౌ పరా ధ్యానం బొక్కటి"** అని చెప్పి, అది చాలునని, అదే 'భాగ్య' మని భావిస్తూ (14) సర్వేశ్వరి సమర్చనం కన్న సంపద లేదనే సంస్కారాన్ని ప్రకటించారు కవి.

**“నీ సాహాయ్యంబది లేక ఆచరణమున్ సాధ్యంబె?”** (21) అంటూ అమ్మ అనుగ్రహంతోనే ఆధ్యాత్మిక చింతన, యోగసాధన, సాగుతాయని వివరించారు కవి.

**“కష్టాలు కలకాలం కాపురం చేయవని ధైర్యం చెప్తారు గానీ, సుఖాలు శాశ్వతం కాదని నిజం చెప్పరెవ్వరూ”** అంటూ **“ఇష్టానిష్టములు యుష్మదీయములే “** (25) అన్న శరణాగతి ప్రకటించారు కవి.

దైవలీలలు చిత్రంగా ఉంటాయి. రామదాసును కష్టాలపాలు చేసిన తానీషాకు కనిపించాడు రాముడు. రామదాసుకు కాదు! ‘పూర్వజ’, పద్మనాభ సహోదరి అయిన విశ్వజననీ సందర్శన భాగ్యం **“పాపాత్ముండైన కంసు డందగలిగెన్”** (36) అంటూ చిత్రమైన లీలా విశేషాలను ప్రస్తావించారు కవి.

సగుణోపాసనకు శ్రద్ధాభక్తులు కావాలి. సగుణోపాసనను మానివేసినంత మాత్రాన జ్ఞానులై పోరు. సోమరులౌతారు గాని. **“సగుణోద్భాసిత రూపమందు నిను మేల్ సంబారముల్ గూర్చి సల్పగ నర్చాదుల పెద్ద సోమరిని”** (60) అంటూ తనమీదే పెట్టుకొని ఈ సత్యాన్ని వెల్లడించారు కవితా ప్రసాద్.

పాపం బాధ హేతువని, పుణ్యం మంచిదని మనలో చాల మందికి ఒక అపోహ. కాని అది కూడా బంధ హేతువేనని గుర్తించాలంటున్నారు కవి. అందుకొక మంచి దృష్టాంతం చెప్పారు. **“బంధంబన్నది యేర్పడంగ గొలుసున్ బంగారమో లోహమో... చర్చింప లాభంబు లేదందున్..”** (68) అని స్పష్టం చేసారు కవితా ప్రసాద్.

లోకంలో సాధారణంగా విత్తనం ఏ జాతిదో ఆ జాతి మొలకే వస్తుంది కదా! ఈ అంశం చెప్పి **“నీ చిత్తోద్భావులమే! త్వదీయగుణముల్ సేరంగ వే మన్మనోవృత్తిన్! “** అని సర్వేశ్వరిపై గడుసుగా ప్రశ్నాస్త్రం సంధించారు కవి.

అమ్మకూ తనకూ మధ్య పంతాలూ ‘పట్టువిడుపులు’ లేవని ముందు ప్రస్తావించి, **“నాకీవిత్తువు గాక పుట్టు విడుపున్”** (86) – అంటూ తన మోక్షేచ్ఛను చమత్కారంగా వెల్లడించారు కవి.

మన న్యాయస్థానాల్లో భగవద్గీతను ప్రమాణ గ్రంథంగా చూపిస్తారు. దేవుని ఎదుట ప్రమాణం చేసి “అంతా నిజమే చెపుతాను, అబద్ధం చెప్పను” అని

ప్రకటిస్తారు సాక్షులు. చెప్పేవన్నీ అబద్ధాలే. దొంగ సాక్ష్యాలే. **"నగుబాటౌ గద! యీ దురాచారం బెన్నండీఁగునో"** (92) అని ఆవేదన చెందారు కవి. 'భగవానుని వాణిని' యిలా అపహాస్యం చేయటం తగునా? అని కూడా ప్రశ్నించారు కవితా ప్రసాద్.

ఇలా ఎన్నో సామాజిక, ఆధ్యాత్మిక అంశాలను ప్రస్తావిస్తూ, చిత్తశుద్ధినీ భక్తిభావాన్ని ప్రబోధిస్తూ సాగింది యీ శతకం. ప్రతి పద్యమూ ధారాశుద్ధిని, శయ్యా సౌభాగ్యాన్ని సంతరించుకొని హుందాగా సాగింది. తెలుగిళ్ళలో నిత్యమూ వినిపించే నుడికారాలూ జాతీయాలూ ఈ పద్యాలలో అలవోకగా దొర్లాయి. **"డబ్బుదస్కములు"** (5), **"రోగాల్ రొస్టులు"** (10), **"తుంగంద్రొక్కుచు"** (8), **"బ్రతుకు గోదారౌను"** (38), **"కడుపు గట్టుకొని"** (47), మొదలైన ప్రయోగాలు శతకపద్యాలను సామాన్యులకు చేరువ చేస్తున్నాయి.

కామేశ్వరీ వైభవాన్ని, అంతరంగంలోని ఆర్తినీ భక్తినీ, ప్రకటిస్తూ సాగిన యీ శతకం కవితా ప్రసాద్ ప్రతిభా పాండిత్యాలకు అక్షర దర్పణం. నిండు మనస్సుతో అభినందనలు అందిస్తున్నాను. కామేశ్వరీ దేవి అనుగ్రహంతో 'కవితా ప్రసాదాన్ని' తెలుగు వారందరికీ పంచిన ఈ కవి లేఖిని నుండి మరెన్నో మంచి రచనలు రావాలని ఆకాంక్షిస్తూ సెలవు.

విజయవాడ. **మల్లాప్రగడ శ్రీమన్నారాయణ మూర్తి**

14-03-2021



**డా॥ సూరం శ్రీనివాసులు**

ఎం.ఏ (తెలుగు), ఎం.ఏ (సంస్కృతం)
విశ్రాంత ప్రధానాచార్యులు,
ఓరియంటల్ కళాశాల,
తిమ్మసముద్రం.



## సౌందర్య శతకం

తెలుగులో శతకరచన పుంఖానుపుంఖంగా సాగుతున్న రోజులివి. ఛందస్సుకు తప్ప మరెవరికీ సమాధానం చెప్పుకోవలసిన అవసరం లేని స్వేచ్ఛ శతక రచనలో అనాదిగా ఉంది. అది ముక్తక రచనమైనా తెలుగు వారిని గట్టిగా పట్టుకొన్నది.

మెదడు ఆలోచనల పుట్ట. వాటిని ఇతరులతో పంచుకోవాలని అని పిస్తుంది. పద్యాలు వ్రాయటం కుదిరితే అదే శతక మవుతుంది. ఒకటి రెండు మాటలకే కట్టుబడి జీవితాన్ని గడపటమే చాలా కష్టం. అయినా వందలకొలది హితోపదేశాలు చేస్తారు. చెప్పేవాడికి వినేవాడు లోకువ. చెప్పినవే చెప్తారు. ఎందుకంటే చేసిన సంసారమే చేస్తున్నాం గదా అంటారు. నా భక్తి రచనలు నావి అంటూ వెలువడే భక్తి శతకాలకు కొదవే లేదు.

ఇటువంటి శతక సాహిత్య నేపథ్యంలో శ్రీ కవితా ప్రసాద్ గారి 'కామేశ్వరీ శతకం' వెలువడుతోంది. ఇది భక్తి శతకమా? అవును. కాదు. ఇది హితోపదేశ శతకమా? అవును. కాదు. ఇది తాత్త్విక శతకమా? అవును. కాదు.

అవును, కాదు... రెండూ ఎలా కుదురుతాయి అంటే అలాగే కుదురుతాయి. ఎక్కడ ఏది ఎలా ఉండాలో అది ఆ తీరుననే ఉంటే ఉన్నట్టూ, లేనట్టూ కూడా. అంటే ఉండి చేయవలసిన పనిని చేస్తుంది. పని మాత్రమే చేసి కనిపించకుండా ఉండవలసిన రీతిలో అదృశ్యమవుతుంది. అలా భక్తి, తత్త్వం, లోక రీతి, జన నీతి, సుభాషితం, సూక్తీ అన్నీ తమ ఉనికిని నిలుపుకుంటూ పద్యం ఉనికిలో అంతర్లీనమయ్యే మంచి కవితా విన్యాసం ఈ శతకంలో కనిపిస్తుంది.

ఈ విన్యాసానికై కవికి ఉపకరించినవి రెండు అంశాలు. ఒకటి భావాలపై నియంత్రణ. ఏ భావం ఎంత వరకూ సరిపోతుందో అక్కడికి ఆ భావాన్ని ఆపేస్తారు. రెండవది భాషా నియంత్రణ. ఈ రెండవ అంశమే ఈ శతకాన్ని మామూలు శతకాల కన్న భిన్నమైన గౌరవ స్థానంలో నిలుపుతుంది. కవికి ఆ శైలి సహజసిద్ధమో, అభ్యాస సాధితమో కానీ శైలిలో ప్రౌఢిమ కనిపిస్తుంది. తద్ధితాంత పదాలను తద్ధితంగా కవి చాలా చాలా ప్రయోగిస్తారు. అయినా అవి సహజ సౌందర్యాన్ని పోగొట్టుకోవు. కవితా సౌందర్యాన్ని దెబ్బతీయవు. మధ్యలో దేశ్యపదాలు ఇమిడిపోతాయి. పదాల సహకారంతో భావాన్ని సాగదీసే లక్షణ మసలు కనిపించదు. భావాన్ని చెప్పటానికి పదాలను వెతుక్కున్నట్టూ కనిపించదు.

ఒక శతకమాత్రంగా కాక  కవితా సౌందర్య శతకంగా "కావవే! కామేశ్వరీ!!" శతకాన్ని భావిస్తూ రచయితను మనసా సవినయంగా అభినందిస్తున్నాను.

బెంగళూరు.
16-05-2021

**సూరం శ్రీనివాసులు**
9440242348

# శతక సంభవము

పరిత్యృ ప్రాజ్ఞులకు ప్రణామములు.

కవికుల ప్రాతస్స్మరణీయులు శ్రీ తిరుపతి వేంకట కవులు కామేశ్వరీ శతకమును వ్రాసియున్నారన్న విషయం తెలిసినదే. ప్రముఖ రచయిత బ్రహ్మశ్రీ మహీధర రామశాస్త్రి గారు (రాజమహేంద్రవరము) ఒక వాట్సాప్ సమూహంలో రోజూ అందులోంచి ఒక పద్యం చొప్పున ఆడియోను వినిపించేవారు. ఆ సందర్భంలో అప్పుడప్పుడూ ఆ పద్యాలలో భావార్థాల గురించిన చర్చ అల్పజ్ఞుడనైన నాతో (కూడా) చేయటం జరిగేది. ఎక్కువ భాగం ముద్రారాక్షసాల వలన వచ్చిన సందేహాలే! వారు దానిని సుసంపన్నం చేసిన సందర్భంగా నే నొకటి రెండు పద్యాలను కామేశ్వరీ మకుటంతో వ్రాసి ఆ సమూహంలో ఉంచటం జరిగింది. అప్పుడు శ్రీ మహీధర వారు శతకంగా పూర్తిచేయండి అంటూ సూచించటమే కాకుండా వదలకుండా కొంచెం వెంటపడ్డారనే చెప్పవచ్చు. సరే! పెద్దల మాట! పాటిద్దామని నా ప్రయత్నం నేను చేసాను. మధ్యమధ్యలో వారు తమ అభిప్రాయాలను ప్రకటిస్తూ తోడ్పాటు నిచ్చారు. ఫలితంగా అమ్మ కృపతో స్ఫురించిన రీతి శతకం ఇలా రూపుదాల్చింది. ఈ శతక పద్యాలను కూడా సంపూర్ణంగా రోజూ ఒక పద్యాన్ని భావ సహితంగా అనేక వాట్సాప్ సమూహములలోనూ వినిపించిన శ్రీ మహీధర వారికి పునః కృతజ్ఞతలు. (నూరవ పద్యంలో మహీధర పద ప్రయోగం వారి గౌరవార్థంగానే చేసాను.)

నా అభ్యర్థనను మన్నించి తమ విలువైన సమయాన్ని వెచ్చించి ఈ శతకంపై తమ అభిప్రాయమును, ఆశీస్సులను అనుగ్రహించిన ఉభయభాషా విశారదులు, విఖ్యాత ప్రవాచకులు, ప్రవచన కీర్తిమంతులు, ఆచార్య బ్రహ్మశ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణ మూర్తి గారికి; నిశితమైన పరిశీలన చేసి మెఱుగు పరచుటకు తగు సూచనలను చేసి తమ అభిప్రాయమును ప్రసాదించిన శతావధాని, ప్రసిద్ధ కవి పండితులు, సంస్కృతాంధ్రభాషా నిష్ణాతులు, ఆచార్య డా॥ సూరం శ్రీనివాసులు గారికీ వేవేల వందనములు. అలాగే అర్థవంతమైన సూచనలను దయచేసిన 'అవధాని ప్రాచార్య' బ్రహ్మశ్రీ ధూళిపాళ మహాదేవమణి గారికి, అవసరమైనప్పుడు సందేహ నివృత్తి చేసిన శతావధాని

బ్రహ్మశ్రీ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్ గారికి కూడా నా కృతజ్ఞతాభివందనాలు.

**కాళిదాసాదులకునైన కలవు తప్పు**
**లనిరి పెద్దలు, మాదృశు లనగ నెంత?**
**తప్పు కల్గిన దిద్దుడు మెప్పు గాను**
**బాలునకు బుద్ధి నేర్పిన భంగి కవులు.**

అన్న అబ్బయామాత్యుని పలుకులే నాకునూ శరణ్యము

అందరిలోనూ ఉన్న అమ్మకు సభక్తికంగా ప్రణమిల్లుతున్నాను. ఈ పద్యాలను అమ్మ ఆకర్ణించినదని గాఢంగా నమ్మటానికి నా అనుభవాలు నాకు ఉన్నాయి. అయినా ఆవిడ వినకుండా కనకుండా సంకల్పించకుండా ఈ బ్రహ్మాండంలో ఏం జరుగుతుంది కనుక. నాహం కర్తా.. స్వస్తి.

రాజమహేంద్రవరము **కవితా ప్రసాద్**

ప్లవ వైశాఖ శు ౧౫

26-05-2021



# మంగళాచరణము

శ్రీ కరిముఖునిం గొల్చెద
శ్రీకర సుముఖున్ సభక్తి శ్రీమాతకు నే
వో కొన్ని పద్య వినతుల
సాకల్యంబుగ నొనర్ప సమ్మతి నిడగన్!

వినవయ్యా! చేట చెవుల
వెనకయ్యా! నేను జేయు వినతుల నీవున్!
తన గారాబంపుఁ గూనవు
ననుఁ బ్రోవుమనుటకుఁ జెప్ప నచ్చిక వినుఁగా!

కామేశ్వరాఖ్య! వప్తా!
కామేశ్వరి వేల్పునందుఁ గాంచేదు నిన్నున్!
నామొఱల నాలకించేఁగ
శ్రీ మాతన్ సుప్రసన్నఁ జేయఁగఁ దలతున్!

శ్రీమాతృకార్య వాహకు
లై మమ్మనయంబును వరదాభయకరులై
బాముల నూడ్చేచేఁ బ్రోచెడు
నా మూర్తిత్రయముఁ గొల్తు నైహికమీఁగన్!

నన్నయను విశ్వనాథుని
సన్నుత కవిపుంగవుల ననన్నిభ కవితా
పెన్నిధులన్ స్మరియించెద
నన్నీకృతిఁ జేయ దీవనలిడ ననువుగన్!



# కావవే కామేశ్వరీ!

## (కామేశ్వరీ శతకము)

శ్రీకైవల్యపదమ్ముఁ గాక కొఱలం జింతింప సంసారపుం
గీకారణ్యతమఃప్రదేశచలదంఘ్రిన్నాకు వేరొక్కఁడే
లా కామ్యంబిఁకఁ జాలుఁ జాలయిన జన్మానేకముల్ స్మృత్వరీ!
నీ కై నాపయి నూన్చి వైళమిడవో నిర్వృత్తిఁ గామేశ్వరీ! 1

తనువున్ బ్రాణము నిచ్చి లోకమున సంధానించితే కాని నా
కని గోరంతయునేని స్వేచ్ఛనిడితింగావే కదా త్వన్నియం
త్రణమం దూపిరులాడుచుండ మఱి యేనాఁడెట్లు వర్తించినన్
గొన నాకర్మఫలంబు నాకెటులఁ గైకోనౌను గామేశ్వరీ! 2

లోకంబందునఁ ద్రోయలేదొ శుకునిన్! బ్రోవంగ బ్రహ్మోత్కుగా
నీ కేకారణమయ్యెనో? నిను నిలందీయంగ నేనెంత! యెం
తో కొంతైనఁ ద్వదీయభావమున నన్నున్ జన్మపర్యాయ కా
రాకూపంబుననుంచి విడ్చుఁ దలుపం బ్రార్థింతుఁ గామేశ్వరీ! 3

ప్రాకామ్యాదులఁ గోరి నిన్ను భజియింపంగా వయస్సేమొ కా
నే కాదియ్యది నాకు యుక్తము ముదిన్నేనేమి భోగింతుఁ ద
ల్లీ కాత్యాయని! యైహికంబుల యెడన్ లేదమ్మ నాబుద్ధి త్వ
ల్లోకం బామణిదీవిలోఁ బడుటయే లోనిచ్చ కామేశ్వరీ! 4

పరువుల్వెట్టితి డబ్బుదస్కముల సంపాదింప నీముల్లె నా
కొరగింపంగలదే పరంబని మదిన్ యోచింపఁగానైతి నే
ను ఋణంబుండిన వారి ప్రాప్తికయి నన్నున్ భ్రాంతిఁ బొందించితీ
సరణిం గాదొ! యెఱుంగనీయవు జగత్సంధాత్రి కామేశ్వరీ! 5

వయసున్నానక మిన్నుమన్నులఁ గడుం బైఁబూన దర్పంబు నీ
మెయి స్వార్థంబె హితంబుగా బ్రతికితిం బేరాశఁ గామ్యార్థినై
కయి నెన్నండొక యర్థికేని సలుపంగన్లేదు సాయంబనన్
దయ నన్నుం గనఁగోర నిన్నెటుల నాననీడి కామేశ్వరీ! 6

కైవారింతు శివార్ధరూప శివశక్త్యైక్యస్వరూపా శివా!
చేవేల్గోళ్ళ దశావతారముల సృష్టింజేయు నీశక్తికిన్
భావజ్ఞా! నరవానరాది సృజనల్ స్వల్పాల్ప సంకల్పముల్
గావే మాతరొ! యందు నేను నొకఁడం గన్పెట్టు కామేశ్వరీ! 7

తుంగం ద్రొక్కుచుఁ బాపభీతిఁ బలుగా దుర్వృత్తులం బట్టితిన్
దొంగాటల్గడు నాడితి న్స్వసుఖమే తొల్దొల్త లక్ష్యంబుగాఁ
బొంగుల్వారెడు ప్రాయముడ్గె ముదిమిన్ మోహంబు జేఱెం ద్వదం
ఘ్రిం గాకెచ్చట వ్రాలుదే నెడపఁగాఁ గిణ్వమ్ము గామేశ్వరీ! 8

లెక్కంబెట్టకుమమ్మ వీఁడు నను గొల్చెం గాదు సుమ్మీ మనో
వాక్కాయంబుల శుద్ధి సల్పి యనువున్ వారంబు నే యొండనిన్!
నిక్కంబో యిది చంచలాత్మకుఁడ నన్నీమాయలో ముంచి యీ
ఫక్కిన్నోమ్పుదువేల నింద నిది సంబద్ధంబె కామేశ్వరీ! 9

రోగాక్రోష్టులు వట్టినయ్యెడఁ గడున్ రోదించి గగ్గోలుగా
నీగడ్డేల ఘటిల్ల జేసితివి నాకిట్లంచుఁ బ్రశ్నించెదన్
భోగప్రాప్తి పొసంగు తత్క్షణము నిర్మోక్కంగ లక్షింపఁ ద
ల్లీ! గుర్తించేకయైన రావు! నను సైరింపమ్మ కామేశ్వరీ! 10

నీ సాన్నిధ్యము మూడు మూర్తులకు సంధించెం గదా స్త్రీత్వమున్
నీ సందేశము సేత సృష్టి పెనుపున్ నిప్పచ్చ నిగ్గించుటం
దా సామర్థ్యముఁ బమ్మఁ బొందెఁ గద బ్రహ్మశ్రీశఫాలాక్షులున్
నీసంకల్పమధఃకరించేఁ దరమే నిక్కంబు కామేశ్వరీ! 11

ఎన్నోజన్మలు వచ్చి పోయినవి కానీ లోని జీవుండు దా
నిన్నెందైనను గొల్చినట్టులనగా నీవే యెఱుంగన్వలెన్
మన్నింపంగదె! శక్తిమేరకిపుడింతం జేయుచుంటిం గదా!
సాన్నిధ్యంబు ననుగ్రహింపవె యిఁకన్ సంప్రీతిఁ గామేశ్వరీ! 12

ఐయైయై యనుచుం జడుండొకఁడు బాల్యాలాప కృత్యంబెదో
చేయం దానినె మంత్రబీజ జపవైశిష్ట్యమ్ముగా మెచ్చి నీ
వా యర్భున్ బొనరించి పండితునిగా నాప్యాయతం బ్రోచితే!
చేయందీయుము నాకు మందమతికిన్! శ్రీమాత! కామేశ్వరీ! 13

కానీపైనను నాసలేని పిత నాకై యాస్తు లేమీయనౌన్!
బోనిమ్మా పొగులేల! చాలు గఱపెన్మోక్షప్రదంబౌ పరా
ధ్యానంబొక్కటి! జన్మమృత్యుభవబంధావృత్తి నిర్మూలనం
బౌ నీపాదసమర్చనాకలితభాగ్యంబిచ్చెఁ గామేశ్వరీ! 14

కారే సత్కవు లెన్నఁ గావ్యరచనల్ గావింపరే మున్ను! వా
రేరీ? యెందరి కీర్తు లిమ్మహిని వాసించెం జెమీ నిచ్చేలున్!
బేరైనన్ వినరాము నేఁడు! కృపఁ జూపించేం గదా నీవు భా
షారూపా! చిరకీర్తిఁ గొందురనుటల్ సత్యమ్ము గామేశ్వరీ! 15

ఎవరే యూహలఁ బోవఁ బోనిడుము నీవే మూలసత్త్వంబ వీ
భువనాశేషసమూహకల్పనకుఁ బెంపొందించే డిందించేగన్!
భవదీయోరువిభూతినిం దెలుప సంభావ్యంబె ముమ్మూర్తులా
దివిజశ్రేష్ఠులు కార్యవాహకులకున్ దృష్టించి కామేశ్వరీ! 16

తలలన్దాల్చి త్వదాజ్ఞలెల్ల మువురుం త్రైతక్కలాడంగ నె
చ్చెలులై సేవలొనర్ప వారి సతులున్ జేనూఁచి వింజామరల్!
గలడెవ్వాడు దిశాదశంబునను ధిక్కారంబు సల్పన్నినున్
గలుగన్దర్శన మెన్నియెన్ని జనువుల్ నాకింకఁ బోవంగనౌ
సులభంబో సనకాదిముక్తులకు నిన్జూడంగఁ గామేశ్వరీ! 17

వైవిధ్యంబుఁ బొలార్చు సృష్టివిధి సంభావ్యమ్ము నీవల్లఁ గాఁ
గా వర్ణింపఁగ దుర్విచారపరులై యామ్నాయ భిన్నంబుగా
దైవాతీతమటంచుఁ జెల్లునొకొ దుస్తర్కంబుఁ గావించేగా?
నీవే మూలము నిశ్చయంబుగ హృదిన్నేనెంతుఁ గామేశ్వరీ! 18

క్లీబుండంచేను ద్రస్తరించే సఖులుం గేరించి క్లీవర్ణ మే
దో బాగున్నదటంచు నంతరమునం దోపంగఁ ద్వత్ప్రేరితుం
డై బాలుండు సుదర్శనుండు నిరతమ్మద్దాని భావింప నీ
ప్రాబల్యంబునఁ గూడెఁ గాదె సకలార్థప్రాప్తి కామేశ్వరీ! 19

చాతుర్మాస్యము సేయు విష్ణుడురగచ్ఛాయం దపించున్నినున్!
శీతాద్రిం గమలాసనస్థ శివుదర్చించుం దపంబూనుచున్!
మాతా! ధాతయు నీ తపంబుఁ గొని బ్రహ్మాండంబు లన్సల్పు! స
ర్వాతీతానఘ మూలశక్తివి కదే! ఆద్యాద్య! కామేశ్వరీ! 20

కోఽహం కోఽహమటంచు సంయములు స్వాధ్యాయంబుఁ గావించి శ్వా
సాహారాది నియంత్రితాత్ములయి సధ్యానమ్ము సాగించఁగా
సోఽహంబంచును జ్ఞానదృష్టిఁ బడ శక్యంబయ్యెనే కాని నీ
సాహాయ్యం బదిలేక యాచరణమున్ సాధ్యంబె కామేశ్వరీ! 21

విలయం బేర్పడఁ జేసి, నీరధిని నీవే విష్ణుఁ బుట్టించి యా
యలలం దేల్చుచు మఱ్ఱియాకు పయి నుయ్యాలాట లాడించితే!
తెలియం బోలకపోయెఁ జక్రికి మణిద్వీపాన ని న్గాంచుదాఁ
క! లసత్త్వద్ధృతి మమ్ముబోంట్లెఱుఁగ శక్యంబౌనె కామేశ్వరీ! 22

పరమోత్కృష్టులు భక్తిమై కొలువగాఁ బ్రాపింతురెట్లైన నిన్
బరమ క్షుద్రులు రాక్షసాత్ముల స్వయంబ్రత్యక్షమై కూల్తువే
హరిసంయాన! మదీయమట్టిటును గాదమ్మా! భవద్దర్శనం
బరయ న్నెట్లు ఘటించు! లాఘవవిధం బందించు కామేశ్వరీ! 23

ఒక సిద్ధాంతము శాస్త్రవేత్తృతతి తామూహించి 'బిగ్బాంగు' నా
మక విస్ఫోటఁపుఁ బ్రేలుడీ సకల బ్రహ్మాండమ్ము లావిర్భవిం
చు కతంబైనదటంచుఁ బేర్కొనిరె! తోచుం దన్మహాశక్తి కేం
ద్రకమూలాశ్రయమీవ! మున్నె మినుకుల్ దర్శించెఁ గామేశ్వరీ! 24

కష్టంబుల్ గలకాలముండవని వక్కాణించు లోకజ్ఞులీ
సృష్టిసౌఖ్యములుండబోవు నటులం జెప్పంగఁ బూనర్గదే!
ఇష్టానిష్టము లస్మదీయములౌ తల్లీ! యుష్మదీయమ్ములే!
కృష్టిం జేల్పుట తక్క యన్యబలముల్ లేవమ్మ గామేశ్వరీ! 25

నీ కారుణ్య కటాక్షముం బరపి సాన్నిధ్యమ్ము గూర్చంగదే
స్వాకృత్యంబుల సైచి మాతృసహజవ్యాపార పారీణతన్!
నీకేపాటి నమస్యనైన రవయేనిన్ నామనస్స్ఫూర్తిగా
వీఁకం జేయని వాఁడనైతి! క్షమఁ జూపించేమ్మ కామేశ్వరీ! 26

సురథుండిమ్మనె రాజ్యలాభమును! వైశ్యుండౌ సఖుండిమ్మనెం
బరమంబైన సదాగతిన్ మనమునన్ వైరాగ్య భావంబు పొం
పిరివోవన్! గన నక్కజేంబవుఁ గదా వీక్షించి సాక్షాత్తు నిన్
వరమున్ గోరగ నైహికంబొకఁడటుల్ త్వన్మాయ కామేశ్వరీ! 27

తొలుదొల్తంగల చిమ్మచీకటిని నిందుస్మేర రోచిస్సులన్
వెలయంజేసి తొలంగఁ ద్రోచితె మణి ద్వీపాంతరావాసినీ!
కలయం జూతును నెల్లవెల్గుల నిరాకారా! త్వదీయాంశమున్
వెలిగింపన్మది ద్వైతభావ తమముం బేటాడి కామేశ్వరీ! 28

నిగమాంభోనిధిఁ ద్రచ్చే జ్ఞానులకు రెండేరత్నముల్ సిక్కు వా
నిఁ గొనం జాలు మహౌఘసంచయము సందేహమ్ము లేదించుకై
న గణింపంగ! ననర్ఘ్యమోక్షపదముల్ నారాయణీ యయ్యవే
సగుణాకారపు త్వత్పదాబ్జములు చిత్సంభూత కామేశ్వరీ! 29

తెలియన్నేర్తురె త్వన్మహత్త్వ లవమున్ దీవంచె చావంచె వేల్
దలలున్నం బరమేశ్వరీ! ఇది యదార్థంబట్టి దుర్గ్రాహ్యముం
దల యొక్కండె గలట్టి మానవుఁడనే నాబుద్ధి యెట్లందు జ
న్మలు గోట్లెత్తినఁ గాని నీ కృపవినా మాహేశి! కామేశ్వరీ! 30

మమకారంబు లహంకృతుల్ బెరయఁ ద్వన్మాయా ప్రభావమ్మునన్
నిమిషాభావులునైన గోల్పడి మతిన్నేరాలకుం బాల్పడన్
మముబోంట్లట్లుఁ జరింప మానవులమై మాతా యదేమబ్బురం
బు? మనోనిగ్రహసిద్ధి నాకొసఁగుమా మోమోడి కామేశ్వరీ! 31

నిందావాచ్యములెన్నొ పల్కు రసనన్ నీస్తోత్ర మాడంగ నీ
కందున్ రక్తి జనింపకుండుననఁ గాదన్నన్ మనస్సాక్షియుం
గ్రుందుం! గాని సనాతనీ! లవణమిక్షు స్వాదముల్ పూంచె యీ
బొందిన్నాల్కనొకండె కూర్చితివి నీవుంగాదె కామేశ్వరీ! 32

శర్వాణీ కృపసేతఁగాక కవికిన్ శబ్దంబులున్ భావముల్
సర్వోత్కృష్ట కవిత్వచాతురి మతిన్ సంప్రాప్తమౌనెట్లు స
చ్చార్వీవాఙ్నిపుణత్వమున్ దనదు వైశారద్య సంభూతమౌ
గర్వోన్మత్త కవీశ్వరుల్ జగతిలో ఖ్యాతిన్సమార్జింతురే!
దుర్వారోద్ధృతి నన్ను బూనని మొగిన్ దోడిమ్ము గామేశ్వరీ! 33

తానైపోతిని బ్రహ్మమంచుఁ దెలుపం దథ్యంబె! యెవ్వాని కీ
వైనంబున్ వినిపింపఁబోవు? నశియింపన్ ద్వైత భావంబెదం
దానుంగాక మరొండు నేను గలదో! తత్త్వానుభూతిం గొనన్
తానేలేడు గదా! మరెక్కడిదొ యీద్వంద్వంబు కామేశ్వరీ! 34

క్షత్రంబుం ద్యజియించె నయ్యె నయి సాక్షాద్దైవమా కృష్ణుఁడున్
పాత్రుం జేసితి మర్త్య ధర్మతనయున్ స్వర్గంబు జేరంగఁ దా
గాత్ర త్యాగమొనర్పకే యెవరికిం గానట్టి దీస్సృష్టిలో!
జిత్రంబౌఁ గద నీదు చేత లరయన్ సృక్కక్తి కామేశ్వరీ! 35

పాపాత్ముండగు కంసుఁ డందఁగలిగెం బాదాబ్జము ల్నీవి నీ
రూపంబుం గనఁగల్గెఁ బల్కులు వినెన్ రూపార్చ యత్నించినన్!
లోపంబేమి మదీయభక్తి విధియందున్ యోగమాయాకృతీ !
ప్రాపుంగోరి తపించు దీను నను సంభావింపఁ గామేశ్వరీ! 36

గతజన్మస్మృతు లిచ్చితేని మఱి దుష్కార్యంబు లేమేమి సే
సితినో వాని నెఱింగి దిద్దుకొన మచ్చేతంబు నందేదొ త
ల్చితిఁ గానీ వలదమ్మ పూర్వజని విచ్ఛిన్నంబులైనట్టి బం
ధ తమిస్రంబులు చుట్టినన్ బ్రతుకు గోదారౌను గామేశ్వరీ! 37

భూమాతన్ సహనంపుమూర్తి యనుచుం బూజించి శంసింతురే!
ఆమాత్రంబున స్త్రీలనెల్ల నిలలో నత్యంత మగ్గింతురో!
శ్రీమాతా! మరి మోయుచుండు సతమున్ర్విం బూరుషుండొక్కడే!
లేమల్గన్నను బూరుషుల్ క్షములు గారే మెండుఁ గామేశ్వరీ! 38

కాయంబందున మాయరోగములనేకంబుల్ ప్రవర్తించఁగా
నాయుర్వేదవిధాన వాని నడపంగా తెన్నుఁ జూపించి తీ
మాయారోగమొకండు జీవునికి జన్మల్ ద్రిప్పి వేధించెడున్
వేయంగన్ సరిమందు నీవ సరి యో వింధ్యస్థ కామేశ్వరీ! 39

ఈశీ! నీమఱురూపులే యనగ నింటింటన్ బ్రశస్తంబుగా
రాశీభూత మహాన్నపూర్ణలవలెన్ బ్రాగల్భ్యపాకంబులన్
రాసుల్ రాసులు వండి వార్చెదరు మా నాల్కల్ ప్రసన్నమ్ము గా
నే శాస్త్రంబులు నేర్వనట్టి ఘనలీ యిల్లాండ్రు కామేశ్వరీ! 40

చేదువుల్ వెక్కులు నేర్తురయ్యును బరాజ్ఞానంబు ప్రాప్తింపదే
విధినిన్! ద్రోవను జూపు నంతె చేదువా వీథిం జరింపంగ సం
విదులై బుద్ధిని కట్టడించి యెద నీమీదన్ విలగ్నంబుఁ జే
యఁ దొడంగం గద యొక్కనాటికవు గమ్యంబందఁ గామేశ్వరీ! 41

లోనన్ వెల్గుచేనుండు దివ్వె యొకఁడా రోచిస్సు దర్శింపగా
నేనెంతో తపియించుచుంటి నెదఁ గానీ చూడనౌనెన్నడా
నానాడే కద జీవుడందునది బ్రహ్మానంద వైవశ్యమున్!
దానిం దల్చి నమస్కరింతు నిపుడీద్యౌత్త్రాళిఁ గామేశ్వరీ! 42

మాయామోహ జగంబటంచు నొక సంవాదమ్ము నద్వైత మం
చా యాచార్యుఁడు శంకరుండొక వినూత్నావిష్క్రియం జేసె నే
దో యాకాశ ఘటంబులంచుఁ గనకం బుంగ్రంబు లంచున్ నిజం
బే యాచో భ్రమనూడఁజేయు మగుదీవే నేనుఁ గామేశ్వరీ! 43

కనగం జింతలు వెక్కుచేందములు ప్రాకామ్యాది సిద్ధుల్ లభిం
చిననుం దృప్తియ లేక కోరికలచేఁ జేతమ్ము వేధించెడున్
వినవో! జీవుని వేదనల్ వసుల నెవ్వేళం ద్వదీయాంఘ్రి యు
గ్మనల ధ్యానము దక్క దిక్కు గలదే మాకెన్నఁ గామేశ్వరీ! 44

దారిద్ర్యంబనఁ గాసులేమి యవునో త్రయ్యంత సంవేద్య! నీ
దారిం బట్టక భోగభాగ్యసుఖ తాదాత్మ్యత్ముఁడుం గావుటే
దారిద్ర్యం బననోపుఁ గాని; తనకుం దానబ్బునే యయ్యుఁ ద్వ
త్కారుణ్యాభ్యుపపత్తి సంభవమునం గాకున్నఁ గామేశ్వరీ! 45

ఎన్నాళ్ళో గతియించి క్రన్న వినగా నెన్నెన్నొ ప్రస్తావముల్
నిన్నుం గూర్చి యొకింత యబ్బె శ్రుత పాండిత్యంబెదో! కాని య
చ్ఛిన్నంబైన త్వదీయమాయ నెఱుగం జేనౌనె యజ్ఞాన సం
ఛన్నాంతఃకరణుండ నాకుఁ జేనినన్ జన్మాళి కామేశ్వరీ! 46

సంపాదింతురు గడ్డుకట్టుకొని సంసారంపు మోహానఁ దే
లింపన్ వారిని నీప్సితార్థతిమి హృల్లేఖమ్ము గోల్పోయి! యో
చింపన్నేరరు లేశమైన నిను యాచించేంగ నిర్వృత్తి యీ
రొంపిన్ముంచేక తమ్ముఁ దేల్చేటకునై లోకోతి కామేశ్వరీ! 47

మనయాంధ్యంబును దేర్చ త్వచ్చరణ శుంభత్సుందరాంగుష్ఠ హా
యనపుంజ ప్రసరప్రసాదమొసఁగ న్యాచించుచుంటిన్ శివా!
ప్రణవోద్భాసిని! భానువహ్నిశశిదివ్యత్ర్యంబకాళీక! యీ
చెనటిన్ దల్లివి నీవ గాకెవరు రక్షింత్రమ్మ కామేశ్వరీ! 48

అర్వాచీనపు శాస్త్రముల్ సదివి పుత్త్రాదుల్ ధనప్రాప్తికై
నిర్వాసమ్మును బూనఁ బశ్చిమదిశన్ దేశమ్ములందెక్కడో
గర్వంబొందెడు దల్లిదండ్రులకుఁ బోఁ గాలమ్మునం దొంటులై
నిర్వేదమ్ము వహింపనౌను గదఁటే నిత్యంబుఁ గామేశ్వరీ! 49

రంధుల్ జీవనకంధి యందున గిలగ్రాహంబులై పట్ట నా
బంధాలందునఁ జిక్కి నే నతిమహా పాపంబులే చేసితిన్
గ్రంథిచ్ఛేదనఁ జేయు శక్తికి నశక్యంబౌనొకో నూడ్ప నా
రంధుల్ సంభవ మృత్యుభేదిని! సహస్రారస్థ కామేశ్వరీ! 50

సంతానమ్మును బిన్ననాడె సరియొజ్జం జూచి విద్యార్థిగాఁ
జెంతంజేర్చగ, వత్సరాల పిదపం జేపట్టి పాండిత్యమున్,
సొంతూరుం దలిదండ్రులన్ విడక పొందున్నిల్పి జీవించిరే!
భ్రాంతిన్ హాస్టలు చేర్ప్వులం చిపుఁడదే పంథావలంబాన నే
కాంతంబయ్యెడుఁ గన్నవారికి ముదిం, గాకుల్వలెన్ సంతు సీ
మాంతంబుల్ సమతిక్రమించి యెగయన్ న్యాయమ్మె? కామేశ్వరీ! 51

ఈడేఱంగను బ్రేమయంచునొక వేడేదో మెయిం గ్రమ్మగా
జోడుం గట్టుచుఁ దల్లిదండ్రు లెడదల్ క్షోభించి శోకించేగా
బాడెం గట్టుచుఁ గన్న పేగు లలికిన్ వర్తించు దౌర్భాగ్యులై
నేడీ తీరున సంతులుండ్రి గలినిన్ నిర్భీతిఁ గామేశ్వరీ! 52

కడుపారంగను గన్న పట్టి నన నేఁ గాదయ్యె! నీ లీలగాన్
బుడమిం బుట్టువొనర్చితయ్యె నిక నిన్నుం దల్చినం దల్లిగా
నెడదన్ నాపయిఁ బ్రేమమెట్లొదువు! విఘ్నేశుండు నీకడ్పునం
బడియే పుట్టెనొ యంత ప్రేముడినిడన్ మాహేశి కామేశ్వరీ! 53

నాదేమో యొక రాతిగుండె పరగన్ నాణ్యంబు లే దుండనుం
గాదే సౌఖ్య నివాసమంచుఁ దలపంగాఁ బాడి నీకౌనె! కా
గా దేవీ యొక రాతిగుండున సగమ్మైయుంట నీకుం దగం
గాదో వాటము నాదు గుండెయను నీకాయ్యమ్మ గామేశ్వరీ! 54

నరపంచానన సోదరీ! భువనవంద్యా! వామ పంచాననా
జిర! పంచానన ధోరణా! సతతముఁ ద్వత్సేవానురక్తుండ నో
పరమేశీ! భవసంచితాఘతతి విధ్వంసించి చేపట్టి య
మ్మరొ! నీ పంచేను జేర వేయుమిక నన్మన్నించి కామేశ్వరీ! 55

లపన విపిన వాసిని నాదు రసనా శబరి ప్రతి భ
క్ష్యపు రుచిఁ బరీక్షఁ జేసి తా నందించే నాత్మారాముఁ
డు పరితృప్తుఁడు కాఁగ, కడుకొని పలుక నేరదొ
క పరియును రామ నామముఁ గటకటా కామేశ్వరీ! 56

స్థిర సంస్థాన మొసంగ మ్రొక్కెద మణిద్వీపంబునన్ నీదు మ్రో
ల రహస్తర్పణ తర్పితా! అదియ సంప్రాప్తింపగా మన్మనో
వరివస్యాఫల మన్యమెద్దియును నే వాంఛింపగా నేఱ నీ
శ్వరి! కామేశ్వర వల్లభా! యిడు మనుజ్ఞానంబుఁ గామేశ్వరీ! 57

ఆశ్చర్యం బొదవున్ ద్వదీయ ఘన పాదాబ్జద్వయిం బట్టనుం
బశ్చాత్తాపమునొంది యస్మదఘవర్త్మవ్రజ్యనున్ రోయ నే
దుశ్చింతాత్మకుఁడైనఁ దా దురితముక్తుండౌననంగా మదిం
గశ్చిత్పూర్వజనుస్సకృత్ సుకృతముం గానోపు కామేశ్వరీ! 58

మది నావంతయు సడ్డ లేక బహుసంభార ప్రధానమ్ముగా
కుదురున్ గోల్పడి భక్తిశూన్యమతులై గొప్పల్ ప్రదర్శించుచున్
హృదినిన్ బందుల బంటు కట్నములకై ప్రీతిన్ నిరీక్షించుచుం
బొదలింపన్ ఫలమిచ్చునే వ్రతములుం బొల్పయ్యె నీ తంతు సం
పదలార్జింపను రాజముఖ్యుల కసన్మార్గాన కామేశ్వరీ! 59

సగుణోద్భాసిత రూపమందు నిను మేల్ సంబారము ల్గూర్చి స
ల్పగ నర్చాదులఁ బెద్ద సోమరిని! నాపై వాస్తవం బెంచేఁగా
జగతిన్ సర్వము నీ స్వకీయమన నీసామగ్రి తో నేల చే
యఁగ? నీరూపగ నే స్మరింతు హృది వ్యక్తావ్యక్త కామేశ్వరీ! 60

హయకంఠీరవ వారణాజ ముఖముల్ హత్తించి కార్యంబులన్
నయపల్పంగను నీదు చెయ్దములు వింతంగొల్పు మాబోంట్లకున్!
దయితుల్ కారొకొ మానవుల్? మఱి యయుక్తంబంచు భావించితో
నియమాచారవిహీన మర్త్యశిర మంటింపంగఁ గామేశ్వరీ! 61

ఒకడుండుం దన శక్తియుక్తుల సదుద్యోగించి వ్యాపార మం
దొక యౌన్నత్యపు స్థాయిఁ గైకొనును శ్రీయోగం బదృష్టంబు దై
వకృపాప్రాపణ హేతువన్! గడకునబ్బా పక్షవాతంబు క్ర
మ్మి కయింగాలును లేవకుండును! నినుం బేరెన్న నాల్కాడుటుం
డక పోవుంజేమి! వమ్ము నూ బ్రతుకు సొంతమ్మట్లు గామేశ్వరీ! 62

ఏవేవో నవకాయవంటకములన్ హేరంబ మాతా శ్రమన్
నైవేద్యం బిడనెంచి నీకుఁ దినుబండారమ్ములం గూర్తురే!
ఈ విశ్వంబున నీకు సాటి రుచిగా నేవారలో యన్నపూ
ర్ణా! వండందగు దక్షులుంద్రు! శివభిక్షానంది కామేశ్వరీ! 63

స్మరణాభావ విమోచనీ! స్మరపునస్సంభూత సంజీవనీ
కరుణాదృఙ్మధువాహినీ! కుమతివైక్లబ్యాంధ్య విచ్ఛేద భా
స్కర విశ్వంకర భాసురేక్షణ! హిమక్ష్మాభృ ద్వరిష్ఠాత్మజా!
వరపంచాస్య పతివ్రతా! శరణమంబా నీవ కామేశ్వరీ! 64

శ్రీమాతా ధరణీ గృహంబు వసతిం జేయించి వీడ్కొంటివే!
ఏమమ్మా ననుఁ జూడ నీకు మనసాయెంగాద పొగండునిన్!
మేమిట్లే బసయింటఁ బెట్టి చేదువం బిన్నారులం జూడఁగాఁ
బోమో? తల్లికిఁ బ్రేమలేమి నెఱుగం బోమిట్లు నీమాదిరిన్!
నీ మోమో పదమో కనుంబడ నిడంతేచాలు గామేశ్వరీ! 65

వ్యామోహావృతచేతనేక్షణము సంప్రాపించే సంసారపుం
బాముం జూచి పసిండి జింజిరని సంభ్రాంతిన్ మెడం దాల్చితిన్!
క్షేమం బెట్లు ఘటించు కాటువడగన్, చేటీక యుండ న్నిద
మ్మో మాతా ఫణిభృద్గళుండనొ! త్వదీ యోత్కృష్ట కారుణ్య దృ
క్సౌముఖ్యామృత భేషజంబు పొసఁగంగం గాక కామేశ్వరీ! 66

సినిమాలందున టీవి సెల్లులను నశ్లీలంబు లుద్రేక కా
రణభూతాప్యయదృశ్యముల్గనుచుఁ బిల్లల్ వైపరీత్యంపు వ
ర్తనకుం బాల్పడుచుండ్రి దారుణమృగాలంబోని యస్మత్సనా
తన సంస్కారము సంప్రదాయములఁ గాల్దాటించి! ఈవేద భూ
మినిఁ గాఁపాడఁగ నీవ దిక్కు సివసామేనమ్మ కామేశ్వరీ! 67

బంధంబన్నది యేర్పడంగ గొలుసున్ బంగారమో లోహమో
చేందంబుం బరిశీలనంబొనరుపన్ జర్చింప లాభంబు లే
దందుం! బాపము పుణ్యమున్కతములే యంటించే బంధంబులన్
బంధచ్ఛేదమొనర్చు జ్ఞానమను కైవాలిమ్ము గామేశ్వరీ! 68

సంధ్యావందన మాచరింప రిఁకపై స్వాధ్యాయముం గొందురే!
జంధ్యంబుండునొ లేదొ దైవమెఱుఁ గాచారంపు టూసేలిఁకన్!
వంద్యుల్ భూసురులొక్కనాఁడు జగతిన్ బ్రహ్మజ్ఞు లిప్డో! హరీ!
నింద్యంబాయె ద్విజప్రవర్తనము వింటే తల్లి! కామేశ్వరీ! 69

తన వంశీయులు గొట్టుకొంచుఁ దమయంతం దాము సాఁౌందినం
గనులం జూచుచుఁ గృష్ణుదడ్డుకొనుచుం గాపాడఁ బోలేదు నీ
యనుజాజానమె తత్సహోదరివి నీ కబ్బెం గదో యెంచే నీ
జను లంతఃకలహంబు లాడుకొనుచుం జేవంగ నీ ధారుణిన్
జెనఁగానేరవు వారి బాగుపరుపన్గానీవు గామేశ్వరీ! 70

విత్తేజాతిదియౌఁ బ్రరోహమును దద్భిన్నంబు గాఁబోదు! నీ
చిత్తోద్భావులమే! త్వదీయగుణముల్ సేరంగ వే మన్మనో
వృత్తిన్! సత్త్వగుణమ్మొకింతయును గన్పించేంగ రాదయ్యె! నా
యత్తంబెందుకుఁ గాదు యుష్మ దనునిత్యానంద లోలత్వమున్! 71

మనుజసింహమై దైత్యాధమప్రాణము ల్హరించు
ఘనత నొందంగఁ జేసితి కాదె శ్రీశుని! నీదు వా
హనమునేకద యాతని నావహింపఁగఁజేసి శ
క్తినిఁ బ్రయుక్తిఁ బ్రసాదించితివి తల్లి కామేశ్వరీ! 72

గ్రామగ్రామమునందు నూరి పొలిమేరన్ నిల్పి నిన్ వేల్పుగా
నామంబుల్ వలుఁ గూర్చి నీ యడుగులన్ నాంచారి లంకమ్మగా
సోమాలమ్మనిఁ గొల్తురెంతొ తమకున్ సొంతింటి పెద్దమ్మగా!
సామాన్యందును వానిఁ బట్టనవు నిస్సంశీతిఁ గామేశ్వరీ! 73

సౌశీల్యంబును బాదుకొల్పు చేదువాసాంతమ్ము మృగ్యంబె యా
వేశాంతఃకరణస్వభావమతులున్ విద్వేష వాక్కర్ములున్
రాశీభూతమహోఘమూర్ఖజనులన్ భ్రష్టత్వ మూడంగ దే
వేశీ! దండమునొక్కమారు ఝళిపించీవింక కామేశ్వరీ! 74

మగువల్ పూరుష జాతికంటె తమ సామర్థ్యంబు న్యూనమ్మట
న్చు గణింపంగను జెల్లదంచు గతమందు న్గార్గి మైత్రేయులున్
నిగమాంతర్గత పారమార్థికపుఁ బాండిత్యంబు నార్జించిరో
ను గదా! మేధకు లింగభేదమెటులుండున్ మోక్షకామేశ్వరీ! 75

నాకమ్మో నరకమ్మొ చింత వడగా నాకేల పద్మాంఘ్రి! నే
నీకాళ్ళం బడితిన్ విరాళి! మది సందేహింపనుం బుత్రుపై
నీ కాయ్యున్ జగదంబ! యిత్తువు గదా నీదీవి నోమూలనన్
నాకెంతో యొకయింత తావుఁ గరుణాంతర్భావ కామేశ్వరీ! 76

సతియున్ లక్ష్మియు విష్ణుమూర్తి ప్రభృతుల్ జన్మంబు లెత్తంగఁ బల్
గతి యేమందును మమ్ముబోంట్ల కిఁక నజ్ఞానాంధ కూపాలకున్
గుతి యంచేం దగనంచుఁ గాదనక నాకున్ముక్తి పాటిల్లగా
కృతహస్తాంజలి వేడుచుంటి ననుఁ బాలింపంగఁ గామేశ్వరీ! 77

గుడిలో నిన్ను నమస్కరించి యెదలో కోర్కెల్ ఫలింపంగ ధ్వాం
క్షుఁడనై యాచనఁ జేయుదేను! గుడికిన్ ముందుండు బిస్సాటియున్
గడుపున్ నింపు కొనంగ బిచ్చమడుగున్! క్రైనుంచు మస్తమ్ము పై
నెడఁ బూజారియు దక్షిణార్థియయి! లే దేభేదముం దల్పఁగా!
పుడమిన్ సర్వులు బిచ్చగాండ్రె యడుగ రోక్షంబుఁ గామేశ్వరీ! 78

నేలం గొట్టిన బంతివోలె చిఱుమున్ నేనెంత యత్నించినన్
గూలం బోవక వృద్ధిచెందుచును నాకున్ శత్రుషట్కంబు కా
దేలో యంకియ యింకఁ జెల్లె వయసున్ వీక్షించుమమ్మా కృపన్
నీలోకమ్మును జేరనిమ్ము దొసవున్ డిందించి కామేశ్వరీ! 79

సకలప్రాణులయందు నీవు గలవాసత్యమ్ము మాపూర్వజుల్
బ్రకటింపంగనొ సూక్ష్మజీవులు శరీరంబందు నారోగ్యమున్
వికటింపంగను జేయ రోగమునకుం బేర్పెట్టిరో "యమ్మవా
రు"! కొరోనా రుజ కూడ యట్టిదవు నీరూపంబొ? కావంగ రా
వ కృపావర్షిణి! సర్వరోగశమనీ! వైళమ్ము కామేశ్వరీ! 80

మరుభూమిం జేని రా నొకింత కలుగున్ మాకైన వైరాగ్యమున్
జిరమై నిల్వదు కాని దాలిఁ బడి తా నిద్రించి మేల్కొన్న కు
ర్కురముంబోలె! నివాసనిత్యుఁడవుటన్ రుద్రుండు వైరాగ్య వై
ఖరి స్తైమిత్యము నొంది యుండెఁ దనకుం గాబోలు గామేశ్వరీ! 81

నా చిత్తంబున నెంచి చూడఁ బొర నేనాఁడేని సత్కార్యముల్
వాచాకర్మమనః ప్రవృత్తులనొనర్పం బూన లేదయ్యు నేఁ
గ్వాచిత్కంబుగనైన నీ స్మరణముం గావించుచుంటిం జుమీ!
నాచే నింతియ యయ్యె సైఁచి నను జెంతంగొన్మ కామేశ్వరీ! 82

నీవే నాకు శరణ్యమమ్మ యొరులన్ నేఁ గోరి పాదంబులన్
బోవం బట్టగ నన్న సత్యమది కాఁబోదే కదా! పల్వురౌ
దైవాలందున రూపు వేఱడమ! యద్వైత స్వరూపా! విని
ర్వివాదంబది నీవయే కద యదే వేల్పైనఁ గామేశ్వరీ! 83

బ్రతుకంజాల మటిన్నినాళ్ళు! బ్రతుకన్ బైపెచ్చు లే దీహయున్!
మితి లేకాశకుఁ గూడఁబెట్టు పణమేమీ కూడ రాదన్న మా
ట తలంపంగను నొప్పనైతి! పదమంటన్నీది లక్షింప కే
న్మతి విభ్రష్టుడనై చరించితిఁ గదే మన్నించు కామేశ్వరీ! 84

గళమునందు సూత్రమును మంగళసూత్ర మని మన్నన
సలుపు కాలమెప్డొ గతించె! జెందెముల్ ప్రోచికోళ్ళు
గుల సలుప గోఁకుకొనఁగను గొరముట్టు గానైననున్!
కలి జనులు సూత్ర బద్ధులు కారమ్మ కామేశ్వరీ! 85

నాకు న్నీకును మధ్యయేల పడఁ బంతంబుల్! విభేదంబులే
లేకుండన్ రవయంతపట్టు విడువుల్వేర్మిన్ ప్రదర్శింతుమో
లోకేశీ! భవదంఘ్రిపద్మముల నే రూఢంబుగాఁ బట్టెదన్
నాకీవిత్తువుగాక పుట్టు విడుపున్ బ్రహ్మాణి కామేశ్వరీ! 86

చేవి యేముండెనొ నాకమందు సురనున్ స్వాదించి భోగించేగాఁ
జివరం బమ్మిన సర్వపుణ్యఫలముల్ క్షీణింపఁ బోఁద్రోతురే
భువికిన్ జన్మము నించు గర్భమరయన్! మోహమ్ము నాకేల యా
దివిపైఁ! గావలె నీదు దీవి యిడుమా దీవించి కామేశ్వరీ! 87

మిన్నున్మన్నున నున్న యన్యపదముల్ మేల్గావు నా కేవియున్
గన్నారన్ నినుఁ గాంచు దుర్లభ వరాకాంక్షా మనోబద్ధుడన్
నీ సాన్నిధ్యమె నాకు మిన్న జననీ నిర్వాణ సౌఖ్యప్రదా!
నిన్నేకొంటిని యింటివేల్పుగఁ బడన్ నీమ్రోలఁ గామేశ్వరీ! 88

నీదేపాటిదొ భక్తి? ముక్తి కొఱకెంతే వేడి వేధింపగా
నీదారిన్ సులభంబొ దానిఁ బడయన్ నీకంచుఁ బల్కంగ నో
శ్రీదేవీ యది నీవెఱుంగనిదొ తల్లిన్బిడ్డ లఱ్ఱాచేటల్
గాదే సాజేము వొందునంతవఱకుం గాంక్షాప్తి కామేశ్వరీ! 89

చిరుత ప్రాయమునాడు నీ యెదుట నే శ్రీరాజరాజేశ్వరీ
తొరలన్ విద్యయు భోగభాగ్యసుఖసంతుష్ట్యాప్తి నర్థించితిన్!
ఎఱుకే లేదయె మోక్షదాత్రి వగు నిన్నేకోర్కెఁ గోరంగనౌఁ
బొరపాటయ్యెను బిల్లకాయను గదా పోనిమ్ము! వృద్ధుండ ని
ప్పరి చే చాఁచితిఁ గేకరించి యిడు నిర్వాణమ్ము గామేశ్వరీ! 90

నిప్పుస్తుల్ నడపన్ గళేబరమునన్ నిర్మూలమౌనేమొ యో
యప్పా క్రొవ్వొక మూల చిప్ప, మదిలో వ్యాపించి పేర్కొన్నదే
చెప్పమ్మా యొక క్రొవ్వు దానిఁ గరుగం జేయంగ నేభేషజం
బొప్పున్ నీ చరణోపవాసమె కదా యోగ్యమ్ము గామేశ్వరీ! 91

భగవద్గీతను జేతఁ బట్టి నిజేముం బల్కం బ్రమాణమ్ము సే
యగ వాదిప్రతివాదులిర్వురును న్యాయస్థానమం దెన్నగా
నగుబాటౌఁ గద! యీ దురాచరణమెన్నండీఁగునో! చేయ నా
జగతీదేశికు వాణి నిట్లు పరిహాసంబేల కామేశ్వరీ! 92

కలినిన్ స్వల్పమె పూర్తియయ్యెఁ! గడువంగా నెంతొ ముందుండె! భూ
స్థలినిన్ ఘోరము లేసరేఁగె! నరయన్ ధర్మంబు న్యాయంబనన్
గలికమ్మందునఁ గానరాని స్థితి! కీకారణ్యపుం గ్రూరజం
తులఁ బుట్టించుచు నుంటివో నరులుగా నూఱారఁ గామేశ్వరీ! 93

శివవామార్థతనుస్థితా! విశదరశ్మిస్స్వాదు చాంద్రీసుషి
క్త వివిక్తాంగరుహస్ఫురద్వరపురూ! గ్లౌశీతపృశ్నీక్షణా!
భువనాంబా! మముఁ జల్లఁజూడఁ గరుణా పూర్ణాత్మ! స్వాభావిక
మ్మవునీకున్ మతి జాగుసేయఁ దగునే యార్యాంబ కామేశ్వరీ! 94

కర్మబీజకోశముఁ దెల్పి కల్పాదినిన్ సృష్టికిన్
మర్మము విధాతృన కెఱిఁగింప సృజియించే మొదలిడు
ధర్మమూని బ్రహ్మాండాలఁ దావకాజ్ఞాబద్ధుడై!
నిర్మితి నియతి సాగును నీయిచ్చేఁ గామేశ్వరీ! 95

జనువు నిచ్చిన తల్లికి సహజమ్ము గోప్తృత్వమున్
దనుజ వైరికిడి స్థితిపదమ్ము పోషణ సంరక్ష
ణ నియతిం గూర్చుదీవు ప్రాణతతికెల్లఁ! ద్వదీయక
రనఖ సంజ్ఞల నడచుఁ జక్రధరుఁడు గామేశ్వరీ! 96

సావశేష సృగ్ధ్వంసము సలుపగ రుద్రునికిన్
నీ విడుదు వధికారము నియతకల్పాంతవేళ
నా విధాతృ పునస్సృష్టి కాధారమై నెక్కొను
జీవ కర్మల పరమాణు శిష్టము గామేశ్వరీ! 97

నిరవశేష లయంబును నీవ స్వయంబుగ నీ
శ్వరి! తిరోధాన కృతియందు సలిపి కేవలవౌదువు!
అరయ బ్రహ్మ గోవింద రుద్రాకృతులును నీవయ!
జరుపు నా కృత్యములను నీ శక్తియ కామేశ్వరీ! 98

పంచకృత్యపరాయణ! భవసృష్టి మరలప్రారం
భించే విధి హరిహరులుద్భవింతురు నీవనుగ్ర
హించే! నిది నీకునొక క్రీడ యిచ్ఛాది శక్తులుద్దీ
పించు లీల! నీ సంకల్ప విధృతియ కామేశ్వరీ! 99

భవ విమోచనమే మానవజనికంతిమ లక్ష్యము
సవనమైనను గవనసంస్తవమైనఁ దద్యోచన
య! వినిపించితి యాచనమమ్మ! మహీధర రా
జ వరపుత్రి! కారుణ్య లోచన! ఓము గామేశ్వరీ! 100

నాకీ పుట్టువ నేలయిచ్చితివొ చింతాగ్రస్త సంసారపుం
జీకాకుల్ గలతల్ రుజల్ వ్యథలతో క్షీణించె సత్త్వమ్మిఁకన్
నీ కాపుంబడ నిచ్చగించితి పరా! నిర్ణాశ! సర్వేశ్వరీ!
నాకిమ్మ్మ వరమేనపాత్రుఁడనె యెన్నంగాని కామేశ్వరీ! 101

పలుకుల్ నేర్పిన నీకుఁ దల్లివని నా భావంబు లీరీతి నే
వెలయించేన్ సమకట్టితిన్ వినుచే! నీ వీనుల్ సుమాళించెనో!
ఫలమేమిత్తువొ! వంద పద్దెములలో వాకొంటి నీ నామమున్!
లలితా శ్రీపరమేశ్వరీ! కరుణఁజూడం దెల్తుఁ గామేశ్వరీ! 102

గమనిక – మత్తేభ శార్దూల వృత్తములు గానివి మధురాక్కఱలు

**'కావవే! కామేశ్వరీ' శతకము సంపూర్ణము**



# జననీజనకులు



వాస్తుజ్యోతిష విద్వాన్, దైవజ్ఞ రత్న,
**కీ.శే. బ్రహ్మశ్రీ కవితా కామేశ్వరశర్మ,**
**కీ.శే. రాజ్యలక్ష్మి**

కీ.శే. బ్రహ్మశ్రీ కవితా కామేశ్వరశర్మ సిద్ధాంతి గారు (1916-1990), అవనిగడ్డ, కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్ వాస్తవ్యులు. ప్రసిద్ధ వాస్తుజ్యోతిష విద్వాంసులు మరియు పంచాంగకర్తలు. గొప్ప తపశ్శాలి. "అద్వేషీ నిత్య సంతోషీ గణితాగమ పారగః। ముహూర్త గుణదోషజ్ఞో వాగ్మీ కుశల బుద్ధిమాన్॥ శాస్త్రశ్చామృత వాక్సౌమ్య స్త్రికాలజ్ఞో జితేంద్రియః। నిత్యకర్మరతో యోవై సదైవజ్ఞ ప్రకీర్తితః॥" అను శాస్త్రవిహిత దైవజ్ఞ లక్షణోపేతులు. సంస్కృతాంధ్రాంగ్ల హిందీ భాషాభినివేశముతో అనేక పూర్వ సమకాలీన ప్రాచ్య పాశ్చాత్య జ్యోతిష నిగూఢ సంప్రదాయాలను గురుసంప్రదాయ పద్ధతిలో లోతుగా అధ్యయనము చేసిన వారు. గొప్ప ఉపాసకులు. వాక్శుద్ధి సంపన్నులు. ప్రచారార్భాటాలకు అతి దూరముగా, అతి నిరాడంబరునిగా, ధనార్జనకాంక్ష లేక, శాస్త్ర ప్రయోజనాన్ని తనవద్దకు వచ్చిన వారికి సంపూర్ణముగా అందజేసిన నిష్కల్మష లోకహితులు. " సర్వం ఖల్విదం బ్రహ్మ " అను ఆకళింపుతో జీవితాంతము మెలగిన ఆధ్యాత్మిక యోగి. నాకు తండ్రి. గురువు.

– కవితా ప్రసాద్



# కవి పరిచయం

| | |
|---|---|
| **రచయిత:** | కవితా (వేంకట సూర్య నారాయణ) ప్రసాద్ |
| **జననం:** | 1955 |
| **ఊరు:** | అవనిగడ్డ, కృష్ణాజిల్లా (ఆం.ప్ర) |
| **తల్లిదండ్రులు:** | వాస్తు జ్యోతిష విద్వాన్, దైవజ్ఞరత్న బ్రహ్మశ్రీ కవితా కామేశ్వర శర్మ, రాజ్యలక్ష్మి. |
| **చదువు:** | MSc (chemistry), PG Dip. (Appd. Statistics),(PhD) స్కంధ త్రయ జ్యోతిషము (వారసత్వము). |
| **వృత్తి:** | D.G.M (retd.), ONGC. |
| **అభినివేశము:** | పద్య, వచన కవిత్వములు, కథారచన, వాస్తు జ్యోతిష ముహూర్త శాస్త్రములు. |
| **రచనలు:** | వివిధ పత్రికలలో పద్య గద్య కవితలు, కథలు, వ్యాసాలు, ఆకాశవాణి పద్య సమస్యాపూరణలు, వివిధ కవితా సంకలనములలో రచనలు. |
| **గ్రంథములు:** | శ్రీ రాజశేఖర శతకము,<br>శ్రీ వేంకటేశ్వర ద్విశతి,<br>కొరోన వారణార్థనా పద్యపంచాశిక<br>కావవే కామేశ్వరీ!! (శతకము),<br>ప్రవచన కవితా (౽) కవితలు (వచన కవితా సంపుటి),<br>మాటవెలదులు (పరశ్శతకము),<br>ప్రపద్యాపీడము (ఖండ పద్యకవితా సంపుటి),<br>ఇష్టకథాష్టకము (కథాసంపుటి),<br>ముహూర్త కామేశ్వరము. మొ. |